## లేఖ 7 చిలకమర్తి లక్ష్మీనరసింహం

*నాన్నగారు 1910-16 సం. లలో రాజమండ్రీలో చదువుకున్న రోజులనుండి చిలకమర్తి వారి అనుగ్రహము పొందియుండిరి*

సం
---------------------------------------------

చిలకమర్తి లక్ష్మీనరసింహం
కాకరపర్రు
తణుకు తాలూకా
పశ్చిమగోదావరి జిల్లా

క్షేమం

దిగవల్లి వెంకట శివరావు గారికి ఆశీర్వదించి వ్రాయునది

అయ్యా 11-11-43 తేది మీరు వ్రాసిన కార్డు చేరినది. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు నా కొసంగిన కళా ప్రపూర్ణ బిరుదమునకు మీరు సంతసించి వ్రాసిన సంగతులు వింటిని. మీకు నా యందు గల ప్రేమాతిశయమునకు కృతజ్ఞుడను. నేను ఆరోగ్యంగా ఉన్నాను. మీ కుటుంబము యొక్కయు మీ అక్కగారు సీతాబాయమ్మ గారి యొక్కయు క్షేమము వినుటకు కుతూలహ పడుతున్నాను. ఆ మధ్య మీ అక్కగారు తన స్వీయ చరిత్ర వ్రాయదల్చుకున్నట్లు నాకు వ్రాసినారు. ఆమె దానిని వ్రాసినదా? మీరు ఈ మధ్య ఏమైనా గ్రంథ రచన చేయుచున్నారా? పైన వ్రాసిన నా అడ్రస్ కు జవాబు వ్రాయుడు.

చిత్తగించవలెను

చి|| ల|| నరసింహ

N.B నేను కొలది దినములలో బెజవాడ రాదలిచి ఉన్నాను. అప్పుడు మీ దర్శనము చేయుదును

**శివరావు గారి వివిరణ**: అభ్యుదయ రచయితల సంఘము వారు శ్రీ లక్ష్మీనరసింహంగారి స్వీయ చరిత్రను ప్రకటించినప్పుడు వారీయూరు వచ్చి డా. అచ్చమాంబ[109] గారింట్లో బస చేసి నాకు కబురంపినారు


POST CARD
ADDRESS ONLY
INDIA POSTAGE
Sree
D. V. Sivarao garu
B.A.B.L.
Vakil.
Governor pet.
Bezwada.

[109] డా. కొమర్రాజు అచ్చమాంబ విజయవాడలో ప్రసిద్ధ వైద్యురాలు, మొదట కమ్యూనిస్టుగ నుండి తదుపరిగా 1957 సం.లో కాంగ్రెస్సు లోచేరి Member of Parliament గానుండిరి. వీరు కొమర్రాజు లక్ష్మణరావుగారి కుమార్తె. వీరి తమ్ముడు కొమర్రాజు వినాయకరావు

## లేఖ 8 అయ్యదేవర కాళేశ్వర రావు

*అయ్యదేవర కాళేశ్వరరావు గారు, నాన్నగారు 1922 నుండి విజయవాడలో స్నేహితులుగానుండిరి వారి ఉత్తరములు చాల వుండినవి. అందులో రెండు ఇచ్చట ప్రకటించటమైనది.*

సం

----------------------------------

Nandigama PO
15- 6- 1944

My dear friend,

I congratulate you for the excellent article you have written in Andhra Patrika on Comrade Veeresh Lingam. I am feeling very great relief after you have openly expressed your opinions in the press on the coming………. political social and economic structure of the future. I am going to Bezwada on the 19th and shall stay there for 4 or 5 days. Let us meet there.

Hope you are well
Yours Sincerely

A.Kaleswara rao



My dear friend, Nandigama
PO
I Congratulate 15/6/44
you for the excellent
article you have written
in Andhrapatrika
on 'Comrade Veerasalingam'

POST CARD
ADDRESS ONLY
INDIA POSTAGE

Sree Digavalli
Venkata Siva Rao
B.A. B.L.
Advocate
Governorpet
Bezwada



I am feeling very
great relief after
you have openly
expressed your opinions
in the press on the
Coming danger to our political
Social & economic structure
of the future. I am going
to Bezwada on the 19th.
& Shall stay there for 4 or
5 days. Let us meet then.
Hope you are well
Yours sincerely
A. Kaleswararao

అయ్య దేవర కాళేశ్వరరావు
నాగార్జున విహార్
స్పీకర్
హిమాయత్ నగర్,

హైదరాబాద్
7-8-1959

ప్రియా మిత్రమా,
మీ ఆఫ్రికా జాతియోద్యమము పూర్తిగా అచ్చయి సిద్ధమైనదని తలుస్తాను. ఈనెల 21వ తేదీన సాయంత్రం 5:30 గంటలకు హైదరాబాదు పబ్లిక్ గార్డెన్స్ లోని జూబ్లీ హాల్ లో శాస్త్ర విజ్ఞాన చరిత్ర తెలుగు అకాడమీ యొక్క ప్రారంభోత్సవం చేయుటకును, మీ పుస్తకము, నా పుస్తకము, అయ్యంగారి పుస్తకము ఈ మూడు పుస్తకములును ఆవిష్కరణము చేయుటకును డాక్టర్ రాజేంద్రప్రసాద్ గారు అంగీకరించినట్లు అధికార రీత్యా నిర్ణయం అయినది. ఆహ్వానం పత్రికల అచ్చు వేయిస్తున్నాము. అందరికీ పంపుతున్నాము. మీకు కూడా వస్తుంది. మీరు తప్పక రావలెను. విశేషములు వ్రాయించవలెను. మీ గ్లోసరీ ఏ స్థితిలో నున్నది. ఆంధ్ర ప్రదేశ్ చరిత్ర పూర్తి అయ్యెన సంగతి వ్రాయించవలెను.

చిత్తగించవలెను
అ. కాళేశ్వరరావు



digavalli1943@gmail.com

శ్రీ దిగవల్లి వెంకట శివ రావు గారు అడ్వకేట్
విజయవాడ -2



అయ్యదేవర కాళేశ్వరరావు,
స్పీకరు.

ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
SPEAKER

నాగార్జున ఎవార్.
హిమాయత్ నగర్.
హైదరాబాద్

తేది 7 — 8 — 1969.

ప్రియమిత్రమా,

మీ ఆఫ్రికా జాతీయోద్యమము పూర్తిగ అచ్చయి సిద్ధమైనదని తలుస్తాను. ఈ నెల 21 వ తేదీన సాయంత్రము 5.30 గంటలకు హైదరాబాదు పబ్లిక్ గార్డెన్స్‌లోని జూబిలీ హాలులో శాస్త్ర విజ్ఞాన చరిత్ర తెలుగు ఎకాడెమి యొక్క ప్రారంభోత్సవము చేయుటకును, మీ పుస్తకము, నా పుస్తకము, అయ్యంగారి పుస్తకము, ఈ మూడు పుస్తకములను ఆవిష్కరణము చేయుటకును డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ గారు అంగీకరించినట్లు అధికార రీత్యా నిర్ణయమైనది. ఆహ్వానములు, అచ్చు వేయిస్తున్నాము. అందరికి పంపుతున్నాము. మీకు కూడ వస్తుంది. మీరు తప్పక రావలెను. విశేషములు వ్రాయించవలెను. మీ గ్లోసరి ఏ స్థితిలో నున్నది. ఆంధ్ర ప్రదేశ్ చరిత్ర పూర్తి యైన సంగతి వ్రాయించవలెను.

చిత్తగించవలెను,

శ్రీ దిగవల్లి వెంకట శివరావు గారు, బి.ఏ.బి.ఎల్.,
ఎడ్వకేట్, విజయవాడ - 2.



*digavalli1943@gmail.com*

**లేఖ 9 వేటూరి ప్రభాకర శాస్త్రి**

*శ్రీ శాస్త్రిగారు నాన్నగారికి సమకాలీన సగౌరవ స్నేహితులు. వీరి లేఖలు చాలవుండినవి. మచ్చుకు రెండు లేఖలు జతచేయబడినవి. శాస్త్రిగారు మద్రాసులోనుండెడివారు. వీరు వ్రాసిన ఒక లేఖలో విస్సా అప్పారావుగారు కూడ రెండు ముక్కలు వ్రాసిరి.*

*సం.*

........................................................

తిరుపతి
13 -11-1945

ఆర్య వందనములు

ఉభయ కుశలోపరి మీరు ప్రకటించిన కథల-గాథలు రెండు వాల్యూములను నాకు బంపగోరుతున్నాను. కొంతకాలము నుండి వాంఙ్మయ విషయంమున మనసు కొల్పని , పని చేయ వీలులేని స్థితిలో నన్య విషయమున నా ప్రవృత్తి సాగుచున్నది. ఈ స్థితిలో నాకు తొందరకలిగించే వాంఙ్మయ విషయములు కొన్ని ఏర్పడెను. అనగా ఒక బుక్ పబ్లిషర్స్ స్కూల్ పుస్తకములపై నా పేరు ప్రకటించుటకుం గోరుచున్నారు. నా పుస్తకములలోని కొన్ని భాగముల వారు ప్రకటించుకొనుచున్నారు. మీ పుస్తకములలో నుండి కూడా కొన్ని భాగముల నందు ప్రకటించుటకు వారికి సూచించమనిన మీ సమత్తిని బట్టి వారిచేత మీకుత్తరము వ్రాయింతును. 'కామమ్మ కథ' ను జరిత్ర సుందరముగా నైదారు

పేజీలలో ఒక పాఠముగా వ్రాసి పంపును కోరుచున్నాను. అందఱము క్షేమము. మీ కుటుంబ క్షేమాదికమును తెలుపగోరుచున్నాను. శ్రీ అప్పారావు గారు ఇక్కడికి వచ్చి ఐదారు రోజులు అయినది. ఇచ్చటనే యున్నారు. చిత్తగించవలెను.

ప్రభాకర్ శాస్త్రి



digavalli1943@gmail.com

దిగవల్లి శివరావు గారికి నమస్కారములు 5-6 దినములై ఇక్కడ వచ్చి ఉన్నాను. అందరూ క్షేమమని తలచెదను. వారం దినములలో పట్నం తిరిగి వెళ్ళుదును. ఇక్కడ అంతా క్షేమం.

చిత్తగించవలెను
విస్సా అప్పారావు




POST CARD
ADDRESS ONLY
INDIA POSTAGE
TIRUPATI
Digavalli Venkatasiva Rao B.A.B.L garu
Advocate
Governorpeta
Bezwada P.O.



digavalli1943@gmail.com

## వేటూరి వారిదే ఇంకో లేఖ

తిరుపతి
11-3-1943

ఆర్య, వందనములు. ఉభయకుశలోపరి. మీ గ్రంధము పలువురు మిత్రులిక్కడ చదివరి. అది వచ్చినప్పటినుండి తిరుగుతూనే ఉన్నది. మీ వాఙ్మయ సేవ తత్పరతకు జోహారులు. మీ బొంట్లు తప్రముగా పరిశ్రమించి చేయతగిన ఘనకార్యము నిక మీద ఉన్నవి. ఈశ్వరుడు మీకు దీర్ఘాయురా రోగ్యములు అనుగ్రహించును గాక.

వేటూరి ప్రభాకర్ శాస్త్రి

శివరావు గారి వివిరణ: శ్రీ ప్రభాకర శాస్త్రి గారు శ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి గారిని చూడడానికి 17-4-1943 తేదీన బెజవాడ వచ్చినప్పుడు మా ఇంటికి వచ్చి నా వ్యాసములను ప్రశంసించి నన్ను ఆశీర్వదించిరి.



digavalli1943@gmail.com

## లేఖ 10 చిరంత నానంద స్వామి

Sri Ramakrishna Math
Publications Department
Mylapore
Madras

ఓం ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ
26 -7-1943

మహాశయ, మీ రచనలను చదివి బ్రహ్మానందం చెందు వారిలోనే నొకడను. దేశభక్తియు మత భక్తియు మీ రచనలందు వెల్లివిరియ చుండును. పాఠకు లలోవానిని పురిగోల్పుచుండును. ఇట్టి రచనలే దేశమునకు ఇప్పుడు అత్యావశ్యకములు.

నాచే రచింపబడి ఆంధ్ర, అన్నామలై మద్రాసు విశ్వవిద్యాలయంలో పాఠ్య గ్రంథం గా నియమింపబడిన శ్రీ వివేకానంద జీవిత చరిత్రను రిజిస్టర్ పోస్టు ద్వారా మీకు నేడు పంపుచున్నాను స్వీకరింప గోరెదను. మీరెప్పుడైనాను మద్రాసు వచ్చినెడల ఒకసారి తప్పక మఠమునకు రాగోరిదను. శ్రీ రామకృష్ణ భగవానుడు మీకు ఆయురారోగ్యములు నొసగి మీచే ఇతోధిక సారస్వత సేవ చేయించు గాక

మీ చిరంత నానంద స్వామి



SRI RAMAKRISHNA MATH
(Publication Department)
MYLAPORE, MADRAS.

No. 3.
Date 26-7-44.

Truth is my God and universe my country—Swami Vivekananda.



POST CARD
ADDRESS ONLY
INDIA POSTAGE

Bezawada

## లేఖ 11 శివలంక శంభు ప్రసాదు

*ఆంధ్ర పత్రికలో ఒక దశాబ్దము పాటు కథలు- గాథలు అను శీర్షిక క్రింద నాన్న గారు రచించిన వ్యాసములు దిన పత్రికలో వరుసగా ప్రచురించారు. అందుచేత శ్రీ శివలంక శంభూప్రసాదు గారు వ్రాసినవి చాల లేఖలు, టెలిగ్రాములు వున్నవి. వారి భారతి పత్రిక, వార సంచికలో కూడా నాన్న గారివి చాల వ్యాసములు ప్రచురించబడినవి. శంభు ప్రసాదు గారి లేఖలు మచ్చుకు మూడు జత చేయబడినవి.*

*సం.*

.......................................................

శివలంక శంభు ప్రసాద్

మద్రాస్
3 -3- 41

మా. రా. శ్రీ దిగవల్లి వెంకట శివ రావు గారికి

ఆర్యా, నమస్కారములు. తమ ఉత్తరము అందినది. చెన్నపట్నం చరిత్ర అను తమ వ్యాసమును సంవత్సరాది సంచికలో ప్రకటించ నిశ్చయించి నాను. తమ అనుమతి లేకుండా సంచికలో ప్రకచురించు చున్నందులకు అన్యధా ఎంచరని ఆశిస్తున్నాను. 4 reprints పంపుటకు ఏర్పాటు చేసేదెను. ముందు ముందు తాము వ్రాయ సంకల్పించుచున్న విషయములు గొప్పవి. రోజువారీగా వచ్చే అంశముల మీద కూడా అప్పుడప్పుడు దినపత్రికకు

వ్యాసములు వ్రాయగోరెదను. తమ వ్యాసములు పత్రికకు నిజముగా అలంకారముగా ఉండును. జవాబు వ్రాయకోరెదను.

చిత్తగించవలెను
శంభు ప్రసాద్



digavalli1943@gmail.com

శంభు ప్రసాదు గారు పంపిన టెలిగ్రాములు
"pray post matter for Kathalu-gathalu' అని వచ్చేడివి

## లేఖ 12 సురవరం ప్రతాప రెడ్డి గారి లేఖ

*వీరి లేఖలోని చేతి వ్రాత చదువుట సాధ్యపడలేదు. తేది తెలుగు అంకెలతో నున్నది. ఈ లేఖ చదివి నకలు చేసి పంపిన నా మిత్రులు వయోవృద్ధులు శ్రీ బొమ్మారెడ్డి రామిరెడ్డి గారికి ధన్యవాదాలు. సురవరం ప్రతాపరెడ్డిగారి ముని మనుమడు, గిరిధర రెడ్డి వీరి అల్లుడు గారు*

సం.

---------------------------------------

హైదరాబాదు
2-8-1945

శ్రీ దిగవల్లి శివ రావు గారి సన్నిదికి
ఆ || నమస్కారములు. తాము అనుగ్రహంతో పంపిన తెలంగాణము అని వ్రాసి పంపిన వ్యాసము అందినది. కృతజ్ఞతతో షష్టిపూర్తి సంచికలో ప్రకటించుకుంటాము. తమకు మళ్లీ మా వందనములు కృతజ్ఞతలు మనవి చేసు కుంటున్నాము



సురవరం ప్రతాపరెడ్డి

## లేఖ 13 కళా వెంకట్రావు

Camp Madras
6-8-1946
Legislative Assembly Madras

Dear friend
My copy of the world constitutions (Dominion Status) published by you has been mislaid by the time I need it most with reference to my work in constituent assembly. If you have any copies in stock, I would request you to send one per vpp to my Amalapuram address
Thanks

Your Sincerely
K Venkat Rao



Kala: VenkataRao

LEGISLATIVE ASSEMBLY MADRAS

Camp- Madras:
6.8.46

Dear friend.
My Copy of the "World Consti-
-tions" published by you has been mislaid
by the time I need it most with
reference to my work in the constituent
assembly. If you have any copies in
stock. I would request you to send one
per v.p.p to my Amalapuram
address:

Thanks.

Yours Sincerely
VenkataRao

Address.
Amalapuram
East Godavary Dt

## లేఖ 14. బెజవాడ గోపాల రెడ్డి గారు

Dr B. Gopala Reddi, MP.,

Camp: Hyderabad

24, Canning Lane, New Delhi 24-10-1966

My Dear Sri Siva rao,

I thank you for your kind letter which reached Simla. When I was in Vijayawada at leisure, we will meet and try to reunite old ties of friendship. Many were your self services to propagate our ideology and awaken and enlightened enthusiasm for understanding the background of our struggle. Glad Andhra Pradesh government has honoured you fittingly

With best regards

Yours sincerely

B. Gopala Reddi



DR. B. GOPALA REDDI, M.P.,
24, CANNING LANE, NEW DELHI

Camp: Hyderabad
24-10-1966.

My Dear Sri Siva Rao,

I thank you for your kind letter which reached me at Simla. When I am in Vijayawada at leisure we will meet and try to re-unite old ties of friend ship. Many were your self services to propagate our ideology and awaken an enlightened enthusiasm for understanding the background of our struggle. Glad Andhra Pradesh Government has honoured you fittingly.

With best regards,

Yours Sincerely,



digavalli1943@gmail.com

## లేఖ15. వావిలాల గోపాలకృష్ణయ్య

Vavilala Gopalakrishnaiah M.L.A 19-9-1966
SATTENAPALLE (A.P)

పూజ్యులు, పెద్దలు, గురుతుల్యులు శ్రీ దిగవల్లి వెంకట శివరావు గారికి, నమస్తే. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము తమకు సన్మానించుచున్నారని తెలిసింది. ప్రభుత్వం తమను గౌరవించడం కాక తమను తాము గౌరవించుకుంటు న్నందుకు అభినందిస్తున్నాను. ఆనాటి జాతీయ ఉద్యమాలలో మీ రచనలు మాబోటి యువకులకు విజ్ఞాన కేంద్రాలుగా ఉండేవి. నిజం చెప్పాలంటే ఆంగ్ల జ్ఞానంలేని నేను ఈ మాత్రం రాజకీయ పరిజ్ఞానం కలిగి ఉంటానికి మీ చరిత్ర రచనలు, పారిభాష నిఘంటువులే పునాది అని చెప్పుకొనుటకు గర్విస్తున్నాను. ఈ నాటి యువకులకు రాజకీయ పరిజ్ఞానం కలిగించే రచనలు కనిపించవు. ఆనాడా పత్రికలు తమకి తాము వ్రాయించకపోయినా వ్రాసిన వారివైన ప్రకటించి సహాయ పడ్డారు. ఈనాడు అది మృగ్యం అయింది. ప్రభుత్వం ప్రకటించే పత్రికలు అచ్చంగా ప్రచారక పత్రికలు అయిపోయినవి. ఆ విధంగా చూస్తే శ్రీ శివ రావు గారి సేవ మమ్ములను వ్యక్తులను చేసింది. వారికి నా జేజేలు.

జై ఆంధ్ర.

భవదీయులు
వావిలాల గోపాలకృష్ణయ్య
19-9-66



digavalli1943@gmail.com

## లేఖ 16. ఆచార్య రంగా

Ranga
Member of Parliament
(Loksabha)

4 Sanafri Bagh Road
New Delhi
15-11-67

My Dear Shri Sivarao,

So glad to hear that you are celebrating the marriage of your son Chy. D.S.Murthy M.Sc

Please convey our good wishes to him and his bride Chy. Sow Rajarajeswari. It is so good to hear from you on this auspicious occasion.

Yours affly
Ranga

\

## లేఖ 17. కందా భీమశంకరం

D 144 Defence Colony
New Delhi -3
29/11/1962

My Dear Sri Siva Rao,
Your kind invitation to the marriage of your daughter. I regret my inability to attend. I should like to convey my blessings and my best wishes for the longitude, happiness and prosperity of the bride and bridegroom

Yours Sincerely
K. Bhimashankaram



D-144 Defence Colony
New Delhi - 3.
29.11.62

My dear Sri Sivarao, your kind invitation to the marriage of your daughter. I regret my inability to attend it. I should like to convey my blessings & my best wishes for the longevity happiness & prosperity of the bride & bridegroom.

Yours sincerely
K. Bhimashankaram



## లేఖ 18. Y.Vithal Rao


Y. Vittal Rao, M. A., B. Ed.
HEAD OF HISTORY AND POLITICS DEPT.
W. G. B. COLLEGE, BHIMAVARAM

BHIMAVARAM
ANDHRA PRADESH.

Date 11-1-65



Y. Vitthal Rao
Head of History and Politics Dept.
W.G.B College

BHIKMAVARAM
Andhra Pradesh

11-1-1965

Respected Sir,

After a long time of seeing you last at Vijayawada, I have been able to write to you this letter. I am glad to inform you that I attended the Ranchi Session of the Indian History Congress and presented a paper on Yenugula Veera Swamayya gari Kasi yatra Charitra which was received with due interest and historical concern. The consensus of the opinion of the Modern History Congress(India) reaction was that I should request you to translate the diary into English for the sake of non -Telugu knowing historians. Evem that little matter that I represented it was interesting also to the President and commentator of the session. I should report to you … about it, … seek your requisitions … .Please let me know if I can see you in the afternoon or forenoon of on Sunday, the 17th instant. With best regards

Yours Sincerely
Y.Vithal Rao

## లేఖ19. మల్లంపల్లి సోమశేఖర శర్మ

*వీరి లేఖలు చాలవుండినవి. మచ్చుకి మూడు మాత్రమే జతపరచబడినవి.*

*సం.*

..........................................................

53, Saravana Perumal Street

Purasawalkam, Madras-7

16-12-1953

శ్రీ యుత దిగవల్లి వెంకట శివరావు గారికి,

విధేయుడు మల్లంపల్లి సోమశేఖర్ శర్మ నమస్కారములు. మీరు శ్రీ కొమాఱ్రా వినాయక రావు ద్వారా ఒక మారు రావలసినదని చెప్పి పంపిన వార్త అందినది. మీరు కబురు చేయకయే మిమ్మును వచ్చి చూడవలసిన మాట. నేను శనివారం 10 గంటలకు బెజవాడ వచ్చినాను. శని, ఆది, సోమ వారములు మూడు దినములు ఎక్కడికి వెళ్ళుటకు వీలు లేకపోయినది. అచ్చమాంబ గారి ఇంటికి కూడా రాత్రి 10 గంటలకు వెళుతూ వచ్చాను. సోమవారం రాత్రి బయలుదేరి ఇక్కడికి రావాల్సి వచ్చింది. నాకు ఏవేవో పనులు ఉండుట వలన కళాశాలలోనే సరిపోయినది. తొందర పనిమీద సోమవారం తేదీ బయలుదేరవలసి వచ్చినది. మీరు కబురు పంపినా వచ్చి చూడకపోవడం నా మనసుకు బాధగానే ఉన్నది. రానందుకు మీరు అన్యధా తలచరని నమ్ముతున్నాను. ఇప్పుడు మీ ఆరోగ్యం బాగున్నదని తలుస్తాను. ఆరోగ్యమును గురించి తగిన జాగ్రత్త తీసుకొన గొరెదను. బెజవాడ వచ్చి కూడా మీరు కబురు పంపిన కూడా వచ్చి మీ దర్శనం చేసుకోలేక పోయి నందుకు చాలా విచారంగా ఉంది. మిమ్మును, అప్పారావు గారిని

ప్రత్యేకంగా కలుసుకోవాలని అనుకొన్నాను. పడింది కాదు మన్నించకోరెదను.

చిత్తగించవలెను

భవదీయుడు

మల్లంపల్లి సోమశేఖర్ శర్మ



53, Saravana Perumal Street,
Purasawalkam, Madras-7,
16.12.53



केवल पता

नाम Advocate

पता Governorpeta

Vijayawada

(Krishna Dt.)



digavalli1943@gmail.com

## సోమశేఖర శర్మ గారి ఇంకో లేఖ

53, శరవణ పెరుమాళ్ మొదలి వీధి,
పురశవాకం,
మద్రాసు-7

7-4-1951

మహారాజశ్రీ దిగవల్లి వేంకట శివరావు గారికి,

మల్లంపల్లి సోమశేఖర శర్మ అనేక నమస్కారములు. తమరు దయతో పంపిన కథలు-గాథలు నాలుగు సంపుటములు ను నేడే కృతజ్ఞతతో అందుకున్నాను. వాటిని సావధానముగా చదువెదను.ప్రాచీన చారిత్రక విజ్ఞానమును ఈ సంపుటముల మూలమున దేశీయులకందజేసిన మీరు ధన్యులు. చరిత్ర విషయమున నేను కొంత కృషి చేసిననూ నేను సేకరించిన దానిని తెలుగుదేశమునకు తగిన రీతిని అర్పింపలేకపోతిని. ఈ విషయంలో మీరే నాకంటే నయము. ఇంకను మీరిట్లే కృషిచేసి దేసీయుల కృతజ్ఞతకు పాత్రులు కావాలని కోరుచున్నాను. నేను ఈ నెల 1వ తేదీన నుంచి అనారోగ్యంగా ఉండి ఒక ఒక మాసము దినములు శలవు పెట్టినాను. మీరు తెలుగు విజ్ఞాన సర్వస్వమునకు మేము కోరిన వ్యాసము వ్రాసి ఉండవలసిన దని కోరుచున్నాను. మీకు స్కీము పంపించు కొన్నాను. రెండవ భాగములో మీరు ఇంకా వ్రాయవలసిన విషయములు న్నచో నాకు మా ఇంటి అడ్రస్సు కు వ్రాయగోరెదను. ఈ తడవ విజయవాడ వచ్చినప్పుడు తమ దర్శనము చేసికొందును. చిత్తగించవలెను.

విధేయుడు

మల్లంపల్లి సోమశేఖర శర్మ








తెలుగు విజ్ఞాన సర్వస్వము

12-వ సంపుటము

మల్లంపల్లి సోమశేఖర శర్మ,
'ఆంధ్ర' సంపుట సంగ్రాహకుడు

తెలుగు భాషా సమితి,
యూనివర్సిటి భవనములు, మద్రాసు-౫,
తేది ౫ – మార్చి, ౧౯౫౧.

ఆర్యవర్య,

వందనములు. మీరు వ్రాసిన జాబు అందినది. మీరు దయతో చేసిన సూచనలన్నిటిని గమనించినాను. అవి సూచించినందుకు కృతజ్ఞుడను. మీరు సూచించిన వారినన్నిటిని ఏదో యొక విధమున ఎచ్చటనో యొక చోట ఇముడ్చ ప్రయత్నించెదను. పేష్వాల కాలములో వారినుండి సన్మానములందిన పండితులను గురించి వ్రాయ గలవారి నెవ్వరినైనను నాకు సూచింప గలరా? రామశాస్త్రి అంధుడా? అతడాంధ్రుడనుట కాధారములు గలవా? వ్రాయ వలసిన విషయములు చాలా ఉన్నవి. అయినా విషయములను వ్రాయ సమర్థులెవ్వరో తెలియుట లేదు. దయ చేసి మీరు కొందరిని సూచింప గలరా?

తమ జాబుకు నిరీక్షించు,

భవదీయుడు,
మల్లంపల్లి సోమశేఖర శర్మ

Sri Digavalli Venkata Sivarao garu,
Advocate,
Buckinghampet, VIJAYAWADA, Krishna Dt.

# లేఖ 20. విస్సా అప్పారావు

*విస్సా అప్పారావు గారివి చాలా లేఖలుండినవి. అందులో రెండు లేఖలు మాత్రమే మచ్చుకు జతపరుపబడినవి.* శ్రీ అప్పారావు గారు మా మేనత్తగారి వియ్యంకుడును.

*సం.*

………………………………………………



విస్సా అప్పారావు

12.6.64.



V Appa Rao

B.1.14 Pattabhipuram
Guntur-2. 2.5.56.



*digavalli1943@gmail.com*

విస్సా అప్పారావు

దానవాయిపేట

రాజమహేంద్రవరం

12-6-1944

శ్రీ దిగవల్లి వెంకట శివరావు గారికి, నమస్కారములు. మీ కార్డు చేరినది. మా రెండవ వాడు చెన్న పట్నంలో పని నేర్చుకొను చున్నాడు. 15వ తేదీ నుండి చాలించి కొద్ది రోజులలో బెజవాడ రావచ్చును. అక్కడ అందరినీ చూచి ఒక రోజు ఉండి ఇక్కడకు రావచ్చును. ఫలానా తేదీ అని నిర్ధారించుకో లేదు. శ్రీ లక్ష్మీనరసింహం గారి పుస్తక విషయమై నేను ప్రయత్నం చేసి కాగితం దొరకు నుపాయముగానక విఫలమనోరధు డనైతిని. పుష్కరము తొందరలు తగ్గిన తోడనే పునః ప్రయత్నం చేయదల్చితిని. ఆరోజులోని సందర్భం వ్రాయగలవాడను. మీరు చేయు కృషి స్థిరముగానుండుటే చాల అవసరం. అచ్చు వేయించాన న్నారు. చాలా సంతోషము. అంతా క్షేమము మీ క్షేమా శయములు వినకోరెదను.

చితగించవలెను
విస్సా అప్పా రావు



digavalli1943@gmail.com

## లేఖ 21 పత్తిపాటి సత్యనారాయణ



P. SATYANARAYANA RAO
RETIRED JUDGE
MEMBER, LAW COMMISSION

21 Wellesley Road
~~60 LODI ESTATE~~,
NEW DELHI.

P. Satyanarayan Rao  
Retired judge

21 Wellesley Road  
New Delhi

Member Law Commission

8th September 1959

Dear Siva Rao,

I could meet Mr Shastri only on Sunday. He promised to write to you. You must have received the letter. As he is a senior Counsil, he can not appear without a junior. I told him to engage a junior of his choice. I shall again meet him today and remind him about it. All are doing well request welfare of you all.

Yours affly  
P. Satyanarayana rao



digavalli1943@gmail.com

## లేఖ 22  ఆకాశ వాణి (ఆనాటి ఎ.ఐ.ఆర్) మద్రాసు కేంద్రపు ప్రోగ్రామ్ డైరెక్టరు, ఆచార్యగారు వ్రాసిన లేఖ

ALL INDIA RADIO
GOVERNMENT OF INDIA

Telegram :—AIRVOICE.
Telephone—86923.

MADRAS STATION.

No. 5213 Dated 11th Nov1938

Sri Digavalli Siva Rao,
Governor-pet,
Bezwada.

Sir,

May I encroach on your valuable time and request you kindly to broadcast a fifteen-minute talk in Telugu entitled "Scientific Literature in Telugu", on Thursday the 22nd December 1938 at 7-15 p.m.

The manuscript of your talk about 1,500 words, based on the short note below may kindly reach me by the 15th December 1938 to facilitate arrangements for due publicity.

Scientific Literature in Telugu. Experience has shown that the great stumbling block in the way of accepting the Mother Tongue/completely as the medium of instruction is the lack of suitable scientific terms in the Mother Tongue. The general tendency is to incorporate the English terms themselves but this does not find favour with several writers of books on Science, who prefer to translate the term even if it involves a certain verbosity of expression as contrasted with the

-2-

single English word. Mr. Siva Rao has devoted much valuable time to this problem of "Scientific Terms" and it will be interesting to hear how he proposes to enrich the Telugu language with such terms."

The enclosed suggestions may be of use.

May I further trouble you to affix your signature to the "Reply Sheet" of the enclosed form and return the same to me at your earliest.

I am tentatively fixing Wednesday the 21st December 3 p.m, for rehearsal of your talk.

Thanking you,

Yours sincerely,
Acharya
DIRECTOR OF PROGRAMMES.

3



digavalli1943@gmail.com

## లెఖ 23 చెళ్లపిళ్ల వెంకట శా(స్త్రి గారు

*నాన్నగారి పై శా(స్త్రిగారు చాల అను(గ్రహము కలిగియుండిరి. వీరు బందరు హిందూ స్కూలులో తెలుగు పండితులైయున్న కాలంలో విజయవాడలో (ప్రఖ్యాత కాం(గ్రస్సు నేత, వైద్యనిపుణులు, డా. ఘంటసాల సీతారామ శర్మగారు వారికి విధ్యార్ధి. అందుచేత వారు డా. శర్మగారికి చాల పరిచయం. వారివలన మా నాన్నగారికి కూడ పరిచయం. వీరు 1944 సం. నాన్నగారికి (వ్రాసిన ఈ (క్రింది లేఖలో నాన్నగారు సంకలనం చేసిన ఏనుగుల వీరస్వామయ్య గారి కాశీ యా(త్ర పైన ఒక పద్యము కూడా (వ్రాసి దస్కత్తు చేసిరి. అసలు (ప్రతి, నకలు చూడు* ఇదే సంపుటిలో 3వ (ప్రకరణము, పుట260-262

*సం.*

........................................................





*digavalli1943@gmail.com*

శ్రీమత్పరదేవతాయై నమః

క్షీరసాగరం
ఆదివారం
19-11-44

మ.రా.రా దిగవల్లి శివరావు గారికి - ఆశీః

అయ్యా, మా తిరుపతి శాస్త్రి గారి చిరంజీవిని[110] మీ దర్శనమునకు పంపుతున్నాను. విషయము వీడేత్మతో మనవి చేయను ఉపకారింప గోరెదను

చిత్తగించవలెను
వెం|| శా శతావధాని

[110] *తిరుపతి శాస్త్రి గారి చిరంజీవి: దివాకర్ల వేంకట శాస్త్రిగారు*



digavalli1943@gmail.com

## లేఖ 24 ఒంగోలు వెంకటరగయ్య

*ఒంగోలు వెంకటరంగయ్య గారు (1867-1949) నెల్లూరు కాపురస్తులు, వృత్తిచే ప్లీడరు. సాహిత్య వేత్త . బహు భాషా కోవిదులు. నాట్యశాస్త్ర గ్రంధాలు కొన్నిటిని ఆంగ్లములోకి అనువదించారు.*

*సం.*

.......................................................

O. VENKATARANGAYYA
PLEADER

Ranganayakulapet
NELLORE

Dated 28-5-1942

మహారాజ రాజశ్రీ దిగవల్లి వేంకట శివరావుగారి సన్నిధికి నేను వ వెంకటరంగయ్య నమస్కారములు. ఉభయ కుశలోపరి. తమరు వేయించిన ఏనుగుల వీరస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర నొకదానినిక్కడ టీచర్ గోవిందరాజులో రామారావు గారు మీరు పంపినట్లు గా చెప్పి యిచ్చినారు. చదువ ప్రారంభించాను. వీరస్వామయ్య .....ఇత్యాదులు చాల ఉపయోగ ములుగానున్నవి. ... ఇంకా చదివిన కొలది విశేషములు వ్రాయుచుండు దును.

చిత్తగించవలెను

వెంకటరంగయ్య

## లేఖ 25 బాజిన సూర్యనారాయణ, జొహాన్సుబర్గు, దక్షిణాఫ్రికా

*బాజిన సూర్యనారాయణ గారు జొహాన్సుబర్గులో ఇండియా ఏజంటు జనరల్ కార్యాలయములో పనిచేసినారు. వారు నాన్నగారికి 1910-16 మధ్య కాలములో రాజమండ్రీ స్కూలు లో సహాధ్యాయుడు. ఈ లేఖకు పూర్తిగా నకలు చేయుట సాధ్య పడలేదు. చివరలో అవగాహన లోపం కారణంగా.*

సం.

--------------------------------------

| | |
|---|---|
| Bajina Suryanarayana | Carlton hotel |
| Office of the Agent General | Johanesburg |
| to the India government | South Africa |
| (Coat of arms embossed Unicorn) | |

25- 3- 29

My Dear Siva Rao

I read in the modern review of January 1929 on page 76 a few letters marked 'Telugu' just below that Dakshina Africa and just after that the name Digaralli Siva Rao I at once thought that it was a mistake of Printers' Devil. I substituted the letter "v" in the place of "r" and read the word. It sounds so sweet and familiar. Now I read the whole name and I found it nothing more than the name of my old classmate and dear friend. Mr. Siva Rao. How proud I was to see tht my friend has written a book on South Africa which has become the place of my exile.

Memory sometimes cannot afford to remember all old things. It is a thing of the past that were the budding folk of Rajahmundry especiallly you in the literary field, as a membere and secretary of the Debating Society and the prominent debator, best lecturer, rather best orator from your from your very young age. I am not surprised to hear and read in the papers and magazine that you have written some books which interest public.

Now I tell you who I am. I am your old classmate in the school of which goes after our revered Guru Veeresalingam Pantulu garu but for whose teachings and writings ideals and principles we had, dear Rajahmundry would not have been what it is today and we would not have been what we are today.  I am the same man who would to take some interest in sports and games address care of postmaster Pretoria South Africa and one who got to the Indian welfare Defence Force I am the same old man who took part in every society and movement that came into existence my name is Bhajina Suryanarayana Rao. If you cannot still remeber and bring to your recollection who I am please ask our old friend like Banda Suryanarayana who may be able to tell you that I am so and so.

You know that I am roaming man and that my life has met with many accidents and incidents sometimes dangerous to even today my life has become the life I Cherish the idea of seeing the various countries on the globe and I am just fullfilng my desire and ambition I am not only able to see this distance land which is known as distance and 500 miles but I have the fortune of seeing my own Indian brothers who are thousands in  numbers who have made South Africa as their home. If had been half as interlligent like you are I would have written volumes on South Africa scenery and its mineral wealth. I am also poor in Telugu and English language beautiful describe this beautiful place but I should like to put it in the words of another and try to give you an idea of it for the present today is the last day for the mail and I could not give you have an idea of South Africa I will write to you later on I request you to kindly write to me all about the political situation in India will you kindly send me any small books on Indian civilization Indian philosophy and spiritualism of old and time and your books on South Africa.

Please convey my best regards to doctor Sharma garu and Kotha Narasimha Rao. His daughter in law was suffering from fits. It was a serious case when I went to Vijayawada 5 months back, I am one of his great family friendly and hence this enquiry…సశేషం

శివరావుగారి వివిరణ

I sent him a reply and also my book some years afterwards he came to and make me we spend some time happily. I think Sri Kurma Venkat Reddy Naidu was the agent General of India when my friend was in South Africa.



digavalli1943@gmail.com

# లేఖ 26 కట్టమంచి రామలింగా రెడ్డి

*రామలింగా రెడ్డి గారు ఆంధ్రయూనివర్సిటి కులపతిగా నుండగా నాన్నగారు 1934 సం.లో రచిం చిన పుస్తకము బ్రిటిష్ రాజ్యతంత్రమును ప్రశంసిస్తు వ్రాసిన లేఖ*

సం

-------------------------------------



62-38—18-4-38—5000

ANDHRA UNIVERSITY.

WALTAIR.

From C. R. Reddy, Hon.D.Litt.
Vice-Chancellor.

Date 4 20th November 39.

My dear Sir,

Let me thank you most warmly for presenting me with a copy of your valuable British Rajya Tantra. The treatment is exceedingly valuable and the bibliographies add to this value I trust that the book will receive wide audience.

Yours sincerely,

CRR

Digavalli Venkata Siva Rao Esq.,
Bezwada.



digavalli1943@gmail.com

ANDHRA UNIVERSITY
From C. R. REDDY
WALTAIR
Vice-Chancellor

Date 20th November 1939

Dear Sir,
Let me thank you most warmly for presenting me with a copy of your valuable British Rajya Tantra. The treatment is exceedingly valauable and the bibiliographies add to this value. I trust that the book will receive wide audience.

Yours Sincerely
C. R. Reddy

Digavalli Venkata Siva Rao Esq
Bezawada

## లేఖ27 కానూరి లక్ష్మణ రావు (K.L.Rao)

*ఇంజనీరు, కేంద్ర ఇరిగేషన్ మంత్రిగా కూడా చేసిన కె. యల్. రావు గారు నాన్న గారికి రాజమండ్రి చదువుకునే రోజులనుండియూ పరిచయం. తదుపరి మద్రాసులో (1911-1922) విక్టోరియా హాష్టలు సహాధ్యాయుడు.*

సం.

---------------------------------

Minister of State
Ministry of irrigation and power
September 24 1966

MESSAGE

I join the citizens of Vijayawada in honouring Shri Digavalli Venkata Sivarao garu at a public reception. As an advocate and author of many books in Telugu Sri Siva Rao gru has won for himself a place of honour and distinction among the writers and his literary works range from History, Politics and Economics to compilation of English Telugu Dictionary on Technical terms. Some of his widely read books include 'History of Andhra Pradesh', 'Lives of great men', 'The Indian War of Independence' etc. As a member on various Comittees, he is sure to make very valuable contribution to the literary field.

I send him my heartiest congratulations and best wishes for many more years of useful service to the nation and Telugu literature. I wish your function also every success.

K L Rao



digavalli1943@gmail.com



राज्य मंत्री
सिंचाई व बिजली मंत्रालय
MINISTER OF STATE
MINISTRY OF IRRIGATION & POWER

नई दिल्ली.
New Delhi. September 24, 1966

MESSAGE

I join the citizens of Vijayawada in honouring Shri Digavalli Venkata Siva Rao garu at a public reception. As an advocate and Author of many books in Telugu, Shri Siva Rao Garu has won for himself a place of honour and distinction among the writers and his literary works range from History, Politics and Economics to compilation of English-Telugu Dictionary on Technical terms. Some of his widely read books include 'History of Andhra Pradesh', 'Lives of Great Men', 'The Indian War of Independence' etc. As a Member on various Committees, he is sure to make very valuable contribution to the literary field.

I send him my heartiest congratulations and best wishes for many more years of useful service to the nation and to Telugu literature. I wish your function also every success.

K L Rao
(K.L. RAO)



digavalli1943@gmail.com

# లేఖ 28 కోక సుబ్బారావు

*సుబ్బారావుగారు నాన్నగారికి 1910-1916 రాజమండ్రి లో చదువుకునే రోజులనుండీ, తదుపరి మద్రాసులో చదువుకునే రోజులనుండి (1916-22) సహాధ్యాయులు. వీరు సుప్రీమ్ కోర్టు ప్రధాన న్యాయమూర్తి గాక ముందు మద్రాసులో ప్లీడరీ ప్రాక్టీసు చేసేవారు. ఒకసారి విజయవాడ కోర్టులో ఒక కేసులో న్యాయవాదిగా వాదించుటకు వచ్చినారని నాన్నగారి దివచర్య పుస్తకములో వ్రాసిరి. చూ ఈ సంపుటిలోనే 6-03-1940 తేదినాటి దినచర్య. తరువాత ఆంధ్రప్రదేశ్ లో హైకోర్టు గుంటూరులో నుండగా వీరు న్యాయమూర్తిగా ఆక్కడ నుండిరి.*

సం.

---------------------------------

Supreme Court of India — Chief Justice of India
Motilal Nehru Marg

July 5 1966

My dear Sri Sivrao,

I thank you very much for your felicition for my appointment as chief justice of India. I have no doubt that your blessings and good wishes will stand me in good stead in the discharge of my duties.

your sincerely
K Subbarao

Sri D. V. Sivarao,
Advocate
Vijayawada-2

Hope you are keeping good health



SUPREME COURT OF INDIA

CHIEF JUSTICE OF INDIA,
2, MOTILAL NEHRU MARG
New Delhi, the ......JULY, 5......19 66

My dear Sri Sivarao,

I thank you very much for your felicitations on my appointment as Chief Justice of India. I have no doubt that your blessings and good wishes will stand me in good stead in the discharge of my duties.

With kind regards,

Yours sincerely,
K. Subbarao
( K. Subba Rao )

Sri D.V.Sivarao,
Advocate,
Vijayawada-2.

Hope you are keeping good ~~health~~ health.
V

# లేఖ29 పుట్టపర్తి శ్రీనివాసాచారి

*శ్రీనివాసాచారిగారు 1958 లో ఆర్కైవ్సు (Archives) డైరెక్టరుగానుండినప్పుడు స్పీకరు, కాళేశ్వర రావు గారు నియమించిన సాహిత్య కమిటీలకు సెక్రటెరీగాకూడా పనిచేసేవారు. ఇంకా కొన్ని కమిటీలలో సభ్యునిగానుండిరి. వారి ఉత్తరాలు చాలానే ఉండినవి. రెండు మచ్చుకు జతచేయబడినవి.*

సం.

---------------------------------

36-635 Vinayakanagar,
Hyderabad-AP.
30th April 1959.

My dear Sri Siva Rao garu,

The meeting of the Academy had to be postponed for want of Quorum for 10th May 1959. I showed your sketch and letter to Sri Kaleswara Rao Pantulu garu and Sri Madapati Hanumantha Rao Pantulu garu. They seem to be impressed.

I am glad your book on South African and also that on Indian History is ready. Naturally South Africa is more topical and will immediately catch the fancy of the Public. Sri Pantulu garu is quite interested in it and is hoping that you will make it somewhat comprehensive, including all the latest material regarding Ghana, S.W. Africa etc. The Awakening of Africa is undoubtedly the burning topic of the Day and to us Indians it has a particularly vital significance.

I sincerely hope you will take up this work with top priority when you are comparatively free from the bustle of the Law Courts and send the Manuscript as early as possible to enable for printing immediately.

Thanking you,

Yours sincerely,
[illegible]

`



digavalli1943@gmail.com

P. SREENIVASACHAR,
M. A., Ph. D. (London)
Director of Archaeology,
Government of Andhra Pradesh,

3-6-635, Himayatnagar
HYDERABAD (AP)

D/DECEMBER 7, 1958.

Dear friend,

Under the advice of Sri A.Kaleswara Rao, B.A.B.L. Honourable Speaker of the Legislative Assembly, Andhra Pradesh, Hyderabad, some friends who are interested in publishing modern literature in the Telugu Language have decided to form the "Andhra Academy of History and Sciences". We want your advice and cooperation in the matter.

A Meeting of all those friends who are interested in this subject will be held on SUNDAY the 14th of DECEMBER, 1958 at 3.00 P.M. in the Honourable Speaker's Chambers, Legislative Assembly, Public Gardens, Hyderabad.

You are requested to be present and give your valuable assistance.

Yours sincerely,

(P.Sreenivasachar)

To

Sri D.V.Sivarao, B.A.B.L.,
Advocate, Suryaraopet,
Vijayawada.2.

## లెఖ 30 వేలూరి శివరామ శాస్త్రి

*వీరు నాన్నగారికి సగౌరవ సన్నిహితులు. వీరి లేఖలు కొన్ని జ్ఞాపకాలు 1వభాగములో ఇదివరలో ప్రచురించబడినవి. ఇంకా అనేకము వుండినవి ఈ సంపుటిలో నొక లేఖ ప్రకటింజబడినది.*

సం.

---------------------------------

Veluri Sivarama Sastry
వేలూరి శివరామ శాస్త్రి
28-11-1962

CHIRIVAD
Krishna Dt)

ఆశః

వివాహ శుభలేఖ చూసి సంతసించితిని త్రిన్నెలలుగా Jandiceతో బాధ పడతూవుండి ఇప్పుడిప్పుడే కోలుకొనుచున్నాను. ప్రయాణము చేయగల స్థతిలో లేను ఇంటనుండియే ఆశీర్వదించుచున్నాను

ఇంక భగవంతం గారికి నేను వ్రాసిన విషయం ఏమైనా అక్కఱకు వచ్చేనా వృధా తెలికితిరి కాదు. ఇప్పుడు పనితొందరలో ఉండియుందురు. మెల్లగా వ్రాయండి. చిరంజీవులనందరిని అడిగితినని చెప్పేది.

వే. శివరామశాస్త్రి

36-635 Vinayaknagar,
Hyderabad-AP.
30th April 1959.

My dear Sri Siva Rao garu,

The meeting of the Academy had to be postponed for want of Quorum for 10th May 1959. I showed your sketch and letter to Sri Kaleswara Rao Pantulu garu and Sri Madapati Hanumantha Rao Pantulu garu. They seem to be impressed.

I am glad your book on South African and also that on Indian History is ready. Naturally South Africa is more topical and will immediately catch the fancy of the Public. Sri Pantulu garu is quite interested in it and is hoping that you will make it somewhat comprehensive, including all the latest material regarding Ghana, S.W. Africa etc. The Awakening of Africa is undoubtedly the burning topic of the Day and to us Indians it has a particularly ~~large~~ vital significance.

I sincerely hope you will take up this work with top priority when you are comparatively free from the burke of the Law Courts and send the Manuscript as early as possible to enable for printing immediately.

Thanking you,

Yours sincerely,
[illegible]

Telury Sivarama Sastri
వేలూరి శివరామశాస్త్రి

CHIRIVADA
(VIA TELAPROLU)
KRISHNA DT.

Dated 28-11-62

[illegible]

## లేఖ31 బండి గొపాలరెడ్డి (బంగోరె)

*బంగోరే గారి లేఖలు చాలా వుండినవి( ఖచ్చితంగా 78) వాటిలో రెండు లేఖలు ఇచ్చట జతపరచటమైనది. మొట్ట మొదటి లేఖ 2-01-1973 తేది వ్రాసినది ఇచ్చట జతపచబడినది. ఇంకో లేఖలో తనను ఏకలవ్య శిష్యునిగా అంగీకరించమని అభ్యర్ధించిరి. పుస్తకముల పైన కూడా అలానే వ్రాసి బహుకరించేవారు*

*బంగోరె (1938-1982) గారు చనిపోయిన వార్త విని శివరావుగారి దినచర్య పుస్తకములో ప్రత్యేకంగా ఇలా వ్రాసుకున్నారు:-*

సం

--------------------------------------

"Note: బంగోరె ఆత్మహత్య 1982 ఆవుల సాంబసివరావు చేసిన అన్యాయం Selected writings of C.R.Reddy; Seven great lives అనే శీర్షిక తో ఆంధ్ర యూనివర్సిటీ ప్రకటించిన పుస్తకములోని జీవితాలన్నీ బంగోరే సేకరించాడు. Vice Chancellor ఆవుల సాంబశివరావు గారు ఆ గ్రంధమునకు సహాయ Edior గా B.Muthuswami అనే రిటైర్డు లెక్చరర్ను చేశారు. బంగోరేను C.R.Reddy and Vemana అనే తెలుగు గ్రంధానికి మాత్రమే Editor గా చేశారు. ఆ అన్యాయము బంగోరేని బాధించింది. ఒక ఇంగ్లీషు పుస్తకంపైన 18/12/1981 .శ్రీ దిగవల్లివారికి ఏకలవ్యుడు అని బంగోరే వ్రాసిపంపాడు. ఇంకో తెలుగు పుస్తకం పైన కూడా అలగే వ్రాసి పంపాడు . పరా: బంగోరె పనిమానుకునినాకు ఉత్తరం వ్రాశాడు. ఆత్మహత్య తలపులకు వస్తున్నవని వ్రాశాడు. నేను జవాబు వ్రాశాను. కాని మళ్లీ ఉత్తరం జవాబు వ్రాయకుండానే నెల్లూరు వెళ్లి అక్కడనుండి సట్లేజ్ కి వెళ్లి ఆత్మ హత్యచేసుకున్నాడు. ఓం శాంతిః శాంతిః"

పై వివరణ శివరావుగారి దిన చర్య పుస్తకములోనిది.........సంపాదకుడు

.................................................................................................................................



digavalli1943@gmail.com

## బంగోరె గారి మొదటి లేఖ 02-01-1973

బంగోరే
2-01-1973
ఎడిటర్

బి గోపాల్ రెడ్డి
అసిస్టెంట్

U.S.I.S
Madras -6

శ్రీ దిగవల్లి వెంకట శివ రావు గారికి నమస్కారములు

నేను మీకు తెలియదు కానీ మీరు నాకు తెలుసు బాగా తెలుసు మీ గొప్ప గ్రంధాల ద్వారా. నేను ఒక అనామకుణ్ణి.

మిమ్మల్ని అడిగేతే తెలుస్తుందని ఈ ఉత్తరం వ్రాసుకుంటున్నాను. మీ సరైన ఆడ్రసు తెలియక వ్రాస్తున్నాను. ఇది మీకు చేరుతుందో లేదో

గాడిచెర్ల హిరి సర్వోత్తమ రావు గూర్చి ఏవోకొన్ని సందేహాలు మెదడులో చోటు చేసుకున్నాయి. కొన్ని కొత్త విషయాలు పాత రికార్డులు తవ్వా తుంటే కనబడుతున్నాయి.

(1) ఆయన ఎడిట్ చేసిన 'స్వరాజ్య' పత్రిక సంచికలేమన్నా మీవద్ద వున్నాయా లేని పక్షంలో అవి దొరికే తావు చెప్పగలరా?

(2) sedition నేరంపై ఆయనకు శిక్ష పడిన 'సంపాదకీయ వ్రాత' మీకు తెలుసా? దాని ప్రతి మీ వద్ద ఉన్నదా? మాదల వీరభద్ర రావు గారు వ్రాసిన సర్వోత్తమ జీవితం లో కొన్ని వాక్యాలు 'కోట్' చేశారు కానీ అవి ఏతేది సంచకలోనుంచొ పేర్కొనలేదు. ఆయనపై జరిగిన కేసుల వివరణ మీకు తెలుసునా? హైకోర్టుకి ఆ కేసు ఎందుకొచ్చింది? ఎట్లా వచ్చింది? సాక్షులు ఎవరెవరు ఏ విధంగా చెప్పారు? వీరేశలింగం హరి సర్వోత్తమరావుకు వ్యతిరేకంగా చెప్పారా? వేదం వెంకటరాయ శాస్త్రి అనుకూలంగా చెప్పారా? ఈ విషయాలు మీకు జ్ఞాపకమా? హైకోర్టు లా పుస్తకాల్లో ఏమైనా ఇందు గురించిన సమాచారం దొరుకుతుందా? హైకోర్టు తీర్పు వెలువడ్డ తేదీ?

తెలుగు పత్రికా సంపాదకుడుగా శిక్ష అనుభవించిన వ్యక్తి అంతకు ముందు ఎవరూ లేరా?

ఈ విషయాలపై సాధికారంగా చెప్పగలిగిన వారు మీరు ఒక్కరేనని నాకు తోస్తున్నది. దయచేసి వ్రాయండి. ఎవరో అనామకుడు అడిగే ప్రశ్నలకు సమాధానాలు ఎందుకు వ్రాయాలి అని అశ్రద్ధ చేయరని విశ్వసిస్తూ, నా సందేహ నివృత్తి చేయగలరని ప్రార్థిస్తూ, మీ ప్రత్యుత్తరం కోసం నిరీక్షిస్తూ. వందనాలతో

శలవు
భవదీయుడు
బంగోరే

From
B. Gopal Reddy
Asst. Editor(Telugu)
U.S.I.S
MADRAS-6



2-1-73

B. Gopal Reddy
Asst. Editor (Telugu)
U.S.I.S.
Madras-6



From—
B. Gopal Reddy
Asst. Editor (Telugu)
U.S.I.S.
Madras-6

INLAND LETTER CARD

VIJAYAWADA-2
(A.P.)

# బంగోరె లేఖ మరొకటి



*06-01-1973 తేదిన వ్రాసిన లేఖలో బంగోరె వ్రాసిన ఈ లేఖ 4 పుటలు. పైన చూపినవి అసలు ప్రతి 3 పుటలు. అందులో మొదటి ప్రతికి మాత్రమే నకలు జతచేయ బడినది. ఈ లేఖలో తనను ఏకలవ్య శిష్యునిగ సమ్మతించమనిరి.*

బంగోరె
6-1-1973

రాత్రి 10.40
B.Gopal Reddy
Asst.Editor (Telugu)
U.S.I.S , Madras -6

పూజ్యులు శ్రీ దిగవల్లి వెంకట శివ రావు గారికి నమస్కారములు,

మీ వాత్సల్యపూరితమైన జాబు. మీ ప్రేమకు పాత్రమైనందుకు ధన్యుణ్ణిగా భావించుకుంటున్నాను. చిన్న జాబులో ఎన్నో వివరాలు వ్రాశారు. మీ వంటి వారికి నావంటివాడు ఏకలవ్య శిష్యుడు గా ఉంటే మీకభ్యంతరం ఉండదుకదా. మీరు కూడ అట్లనే భావించి నన్ను guide చేస్తు ఎన్నోclues ఇస్తూ వ్రాశారు. కృతజ్ఞతలు.

నేను ఇప్పుడుOriental MSS Library నుంచి మద్రాస్ రికార్డ్ ఆఫీసు (Tamilnadu State Archives) ఎగ్మూర్ కు మకాం మార్చాను. కాని నాకున్న తీరిక సమయం బహు తక్కువ. వారంలో 5 రోజులు ఆఫీసులో బొత్తిగా తీరిక ఉండదు. రాత్రిపూట తప్ప. ఇక మిగిలింది శనివారం ఒకటే. ఆదివారాలు నెల్లూరు వెళ్తాను. ఒక శనివారాల్లో ఆ రికార్డు ఆఫీసు మహా సముద్రం. ఎంత ఈదడం? ఇక మిగిలింది రెండో శనివారం అదీగాక మధ్యలోSecond Saturday.5 ఇట్లాంటి శలవులు పొగా నెలకు సగటున రెండు లేదా మూడు శనివారం మాత్రకాలం అంటే సగటున 10 -15 గంటలు ఎంత చూడగలం? అయినా చేతనైనంతలో క్షణం వృధా పోకుండా, అక్కడ స్టాఫ్ పిరిస్థితి దుర్భరంగా వుంటున్నా ఎలాగో తంటాలు పడుతున్నాను. ఎవేవో పాత విషయాలు త్రవ్వుకుంటున్నాను.

ముఖ్యంగా మన తెలుగు పాత పత్రికలనుంచి కొన్ని కొత్త సంగతుల వెంట పయనిస్తున్నాను. తరగటం లేదు. మధ్యలో 'గాడిచర్ల హరి సర్వోత్తమ రావు' ఒక బంగారు గనిగా కనిపిస్తున్నాడు. Madras News paper reports-ప్రభుత్వ translastors నివేదికలన్నీ సంవత్సరాల వారిగా అన్నీ print అయివున్నాయి. దురదృష్టవశాత్తూ ఇవన్నీ confidential గా వర్గీకరణ చేసి వున్నారు. Chief Secretary దగ్గరనుండి special permission వుండాలి. Archives Director అనుమత్తించేందకు లేదు. ఇంతకంటే బుద్ధి తక్కువ rule ఇంకోకటి వుండదు. కానీ 'పరాయి' ప్రభుత్వం- ఎం చేయగలం? ఏదో యాదృశ్చకంగా డొంక తిరుగుడుగా లభించిన మార్గాన పడి కొద్ది కొద్దిగా ఈదులాడుతున్నాను. ఇదీ నా స్థితి.

మీరొక విషయం వ్రాశారు. గాడిచర్ల వారి కేసులో వీరేశలింగం, వేదం వెంకటరాయ శాస్త్రి ప్రభృతులు సాక్ష్యం ఇవ్వలేదు అన్నారు. కాని నాదగ్గరనున్న దాఖలాలు వారు సాక్ష్యం ఇచ్చినట్లే చూపుతున్నాయి (1) వేదం చిన వెంకటరాయ శాస్త్రి రెండేళ్ల క్రితం...

సశేషం

*సంపాదకుని వివిరణ: ఈ లేఖ చాల పెద్దది. 4 పుటలున్నది. అందుచేత శుద్ధ నకలు ఇంత మట్టుకే ప్రకటించ సాధ్య పడినది. అసలు లేఖ లో 3 ప్రతుల జత చేయబడెనవి.*



*digavalli1943@gmail.com*

## లేఖ 32 నార్ల వెంకటేశ్వరరావు

*నాన్నగారి మిత్రులు నార్ల వారు చాల సార్లు నాన్నగారిని కలుసుకుని వుండిరి. వారి లేఖలు కూడ చాలనే వున్నవి. ఇచ్చట ఒక్కటి మాత్రమే జతచేయ బడినది.*

సం.

---------------------------------

March 1982

Dear Friend,

Thanks for you lettter. Will you be in Town for..... Taking the help of your son , please do come for tea any evening. You may telephone to me when it shall be convenient for you to come( Tel 32263). Meeting you will be a matter of most delight to me. With warm regards

Yours Sincerely

V.R Narla



Dear Friend, March 1, 1982

Thanks for your letter. Will you be in Town for some more time? Taking the help of your son, please do come for tea any evening. You may telephone to me when it would be convenient for you to come (Tel. 32263). Meeting you will be a matter of great



delight to me

With warm regards,

Yours sincerely

V R Narla

V. R. NARLA
LUMBINI'
ROAD NO. 7 BANJARA HILLS
HYDERABAD-500 034
TELEPHONE: 32263

15 भारत INDIA 15

Sri D.V. Siva Rao
c/o Mr Digavalli Venkata Ratnam
Advocate
Narsinkar Blocks
Chikkadpalli
Hyderabad
पिन PIN 500020

## లేఖ 33  కొత్తపల్లి వీరభద్రరావు



Dr. K. Veerabhadra Rao
M.A., Ph.D.

Head of the dept. of
Oriental Languages,
Maharajah's College,
Vizianagaram

విజయనగరం,
20-1-59

పూజ్యశ్రీ దిగవల్లి వెంకట శివరావుగారికి వినయపూర్వకముగ
నమస్కరించి కొత్తపల్లి వీరభద్రరావు వ్రాయునది-

ఉభయత్ర కుశలము. మీ గ్రంథం, 'పూర్వరంగములు-1857' చదివినాను. సుప్రసిద్ధ పరిశోధకులయిన మీరు, ఈ గ్రంథమును మహోత్కృష్టముగా తీర్చిదిద్దినారు. పరిశోధకులకిది మిక్కిలి ఉపయోగకరమైనది.

ఇక నేనొక్క విషయమై మీ సాయాన్ని అర్థిస్తూ ఇది వ్రాస్తున్నాను. నేను 'Influence of English on Telugu Literature' అనే విషయంమీద పరిశోధన చేసి ఆంధ్ర విశ్వవిద్యాలయము వారి Ph.D. పొందినాను. నేను పరిశోధన చేయుచున్న దినములలో ఒకసారి మీ ఇంటికి వచ్చి మీ దర్శనం కూడా చేసినాను. ఇప్పుడా పరిశోధన వ్యాసాన్ని నేను అచ్చువేయించాలని అనుకొంటున్నాను. అందులో, ఏనుగుల వీరాస్వామయ్య గారిని గూర్చి వ్రాయునప్పుడు, మీరు ప్రచురించిన వారి 'కాశీయాత్ర చరిత్ర' నుండి వాక్యములను ఉదాహరణలకై గ్రహించినాను. ఇట్లు చేసిన [illegible] లందు, మీకు కృతజ్ఞతను - ఫలానా వారు ప్రచురించిన గ్రంథము నుండి గ్రహించితిని అని చెప్పుచు - తెలుపుచున్నాను. కనుక, అచ్చులో కూడ ఆ భాగముల నుంచుకొనుటకు అనుజ్ఞ ఈయవలసినదిగా వేడుకొనుచున్నాను. నమస్కారములతో

విధేయుడు,
కొత్తపల్లి వీరభద్రరావు.

*వీరు విజయనగరం మహారాజ కాలేజిలో చరిత్ర ఆచార్యులుగానుండేవారు. వారి చరిత్ర పరిశోధనకి సంభందించి నాన్న గారి మార్గదర్శనంకోసం అప్పు డప్పుడు కలుసుకుని పత్రాచారములు జరిపినవారు.*

సం.

---------------------------------

# లేఖ 34 పి.వి నరసింహారావు



RASIMHA RAO, B.Sc., LLB.
"SAHITYA RATNA"
NISTER FOR EDUCATION.

HYDERABAD
DATED 13-2- 1969

Dear Sri Siva Rao Garu,

I am in receipt of your kind letter dated 3-2-1969. I hope you have, by now, received the Working Papers and other literature pertaining to the proposed Official Language(Telugu) Forum. Meanwhile, ...ever, due to unavoidable reasons we have had to postpone the Forum. The next dates will be intimated to you in due course.

As you have stated, I am generally aware of the views held by you in regard to the translation of Laws into Telugu. I am also aware of the views expressed by many other friends, through the newspapers and otherwise. That is why, while sending out invitations, I have taken particular care to see that those friends whose views are known to be at variance with the 'White Paper' are invited to the Forum without fail. So far as I am concerned, I have stated time and again that I shall continue to keep an open mind on the subject. That being so, the views of those who do not agree with the 'White Paper' are particularly welcome at the Forum. The Forum is to be inaugurated by the Chief Justice of Andhra Pradesh and presided over by the Chairman, Official Language-(Legislative) Commission, New Delhi. Judges of the Andhra Pradesh High Court, some Sessions Judges, representatives of Bar Associations, Editors of prominent newspapers, Legislators and fraternal delegates from some other States have been invited to participate in the Forum. I am also intending to invite Members of the Offl. Language (Legis.) Commission hailing from several other States so that we can compare notes usefully with one another. This is going to be a very useful occasion and I thought that a senior scholar like you would benefit us by your presence. There is no question of any one fitting or not fitting into the scheme of the Forum, as such; nor is there any 'scheme' envisaged for the Forum except the avowed object of bringing together several persons concerned with the subject irrespective of their individual opinions and trying to formulate certain guide-lines for practical use. In view of this, I hope you will make it convenient to attend the Forum and participate in its deliberations.

Under the circumstances mentioned in your letter, I shall now have to ask some other friends to move the Working Papers. However, if you kindly agree to move one of the Papers and inform me early, I shall reserve that Working Paper to be moved by you.

Thanking you,

Yours sincerely,
P.V.Narasimha Rao
(P.V. Narasimha Rao.)

*అయ్యదేవర కాళేశ్వర రావు గారు చనిపోయిన తరువాత 1962 సం. నుండీ పి. వి. నరసింహారావు గారు (అప్పటి ఎడ్యుకేషన్ మంత్రి) కాళేశ్వరరావు గారు నడుపుచున్న కమిటీలు( గ్లాసరీ కమిటి, హిష్టరి సైన్సు అకాడమీ, ట్రాన్సలేషన్ కమిటి ఇత్యాదివి) సాగించటమే కాక తాము కొత్తగా ఇంకా కొన్ని కమిటీలను నియమించి అందులో కూడా నాన్నగారిని సభ్యునిగా చేర్చిరి. ఆ సంధర్భములో వారు వ్రాసిన లేఖలు కొన్నివుండినవి. అందులో ఒకటి ఇచ్చట జతపరచట బడినది. అనుబంధము 6లో నింకొక లేఖ జతపరచ డమైనది.*

*సం.*



*digavalli1943@gmail.com*

